# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

వ్యవస్థాపకులు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 13 | రాజమహేంద్రవరము 16-5-1990, 1-6-1990 | సంచికలు 14, 15


—* ఈ సంచికలో *—



రాబోవు సంచికలో:- 1) శివానందలహరి - కొన్ని అనువాదాలు
2) కనకాభిషేకము
3) సుప్రసన్నగారి "స్తుతిప్రబంధము" సమీక్ష
మొదలగు రచనలు ఉంటాయి.

1, 16 తేదీలలో ప్రచురింపబడును.


సంవత్సర చందా రు. 12-00 | విడి ప్రతి 0-60 పై.

6 మాసములకు రు. 6-50


**సాహిత్యపరమైన రచనలకు సమాలోచన స్వాగతం!**

# సంపాదకుని మాట

**Books of the hour and Books forever** అన్నాడు **John Ruskin.**

అంటే కాలక్షేపానికి మాత్రమే ఉద్దేశించి ఏ ప్రయోజనం లేని రచనలు— ఏ కాలమైనా మళ్ళీమళ్ళీ చదువుతున్నా చదివినప్పుడల్లా ఏదో కొత్తదనం చూపిస్తూ ఎన్నాళ్ళకైనా విలువ తరిగిపోని రచనలు.

ఏదైనా రాస్తే కవిత్వమైనా, మరో రచన ఏదైనాసరే దానికొక విలువ ఉండేటట్లు రాయాలి. ఈనాడు అచ్చతెనుగు మనకు వంట బట్టటంలేదు. అరసున్న, ఋ, ఱ, ళ, జ్ఞ వంటివి మనకు కొరుకుడు పడటంలేదు. అంతా వ్యావహారికం. తేలికగా ఉండాలనే సాకుతో భాషను చిత్రవధ చేస్తున్న రోజులివి. ఇలాంటి పరిస్థితులలో కేవలం ధనార్జనకోసమో, అల్పమైన యితర ప్రయోజనాలకోసమో రచనలు సాగిస్తే రచయితలూ! బహుపరాక్! మీ రచనల విలువలే కాదు మీ విలువకూడా సున్న నుంచి అరసున్నకి ఆ తర్వాత శూన్యంలోకి దారితీస్తుంది.

ఒక రచనద్వారా సమాజంలోని చెడును కడిగేయవచ్చు. ఒక రచన ద్వారా చెడునుంచి మంచికి మనిషిని మార్చవచ్చు. హృదయానందమే కాదు సమాజశ్రేయస్సు కూడా రచనలకు పరమావధి కావాలి.

కేవలం విమర్శలూ, సమీక్షలే కాదు మీనుంచి మీ ప్రతిభకు, సృజనాత్మకశక్తికి అద్దంపట్టే మంచి రచనలు రావాలి. అప్పుడే మీకు నిజమైన తృప్తి, రచనలకొక సార్థకతా చేకూరుతుంది.

సహృదయులైన రచయితలు మాతో ఏకీభవిస్తారని ఆశిస్తూ—

—సంపాదకుడు

# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

వ్యవస్థాపక సంపాదకులు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.


## 1. ఆధునిక కవిత్వం - కవి - పాఠకుడూ

—శ్రీ పాతూరి రఘురామయ్య

'ఆధునికుడు ఒక జిరాఫీలా తయారవు
తున్నాడు
కాళ్ళకూ అతని మెదడుకీ
హృదయానికీ
దూరం ఎక్కువై పోతున్నది'

అని ఆరుద్ర ఆందోళన పడుతున్నాడు. ఇందులో పేర్కొనబడిన ఆధునికుడు అన్న పదం కవులకు కూడా వర్తించే అవకాశం ఉంది. శాస్త్ర పరిజ్ఞానం పెరిగినా మానవుడు నైతికంగా తిరోగమించడమే ఆరుద్ర ఆందోళనకు మూలం.

పూర్వకాలంలో మతాల మధ్యన స్పర్థలు పెరిగి సామాజిక అశాంతికి ఏ విధంగా దారితీశాయో, ఈనాడు అదే విధంగా ఏదో ఒక రూపంలో అభిప్రాయ భేదాలు చెలరేగి మానవజీవనాన్ని సంక్షోభితం చేసే స్థితి ఉండటం శోచనీయం. ఇట్టి సంక్షోభస్థితిలో కవులు అనేకములైన మార్గములలో దుష్ప్రభావాలకు లోనవడం అసహజమేమియు కాదు.

ముఖ్యంగా యువకవులు కొందరు ఈనాడు తాము రాసుకునే సుదీర్ఘ వచన కవితా ఖండికలు పత్రికలలో విశేషించి అచ్చొత్తించుకోగలిగినా కవిత్వానికి ఉండవలసిన ఆకర్షణీయ గుణాన్ని చేకూర్చలేక పోతున్నారు. కారణమేమంటే కొందరికి శిల్పంమీద ఎక్కువ శ్రద్ధ ఉంది. కానీ వస్తువుపట్ల అవగాహన కొరవడింది. మరికొందరికి వస్తువే ముఖ్యం కానీ అభివ్యక్తి ప్రధానం కాకపోవడం. ఇంకా కొందరు కవులున్నారు వారికి ఈ రెండూ ముఖ్యం కాదు. తాము ఎక్కువగా కవిత్వం రాస్తుంటామన్నదే అతిముఖ్యం. సింబాలిజం ఇమేజిజం లాంటి పదాలు బాగా అక్కరకొస్తున్నాయి. ఏది కోరకుంటున్నదో దాన్ని కప్పిపుచ్చుకొనేందుకు అస్పష్టత ఒకటి మంచి చిక్కటి దుప్పటిలాగా కనిపిస్తుంది. అందుకే కవులు అస్పష్టతను ఆశ్రయించారు.

వైదేశిక భావనలు తెలుగులోకి రావటం మొదలు పెట్టిన విషయం వాస్తవమే. కానీ కవులు వాటిపేరిట శబ్దాల చేయడం ప్రారంభించి కవిత్వాన్ని పాఠకుల నుండి దూరంగా ఉంచటానికి కృషి చేశారు.

ఏ పార్టీ కవో అని చూసేవారే. కానీ ఏ పాటి కవి? అని మంచి చెడుల్ని చిత్రించే సహృదయులే తెలుగునాట కరువయిపోవడం చింతించదగింది. దీనికి కారణం రాజకీయాల ప్రమేయం సాహిత్యంలో ఎక్కువవటం. ఈ ప్రమేయం యొక్క విరూపరూపమే ఈనాడు చెప్పుకోబడుతున్న 'కమిట్ మెంటు.' ఇది నిబద్ధత.

ఈ నిబద్ధతా భావన ఆయా పార్టీల కవులకు, పక్షాల కవులకు, ఆయా పార్టీల పక్షాల మార్గదర్శక సూత్రాల పరిధిలోనే సంచరించవలసిన స్థితి ఏర్పడి, వారి కవిత్వంలో భావవైశాల్యం కొరవడింది. అజంతా అన్న కవి మానవీయభావ మార్గ పథికుడుగా 'చెండాలుకు కన్నీళ్ళు లేవు' అని వ్రాశాడు. ఇది రాజకీయ కవులకు కొరుకుడు పడని విషయంగా కనిపించవచ్చు. ఇంతకీ కవి బంధితుడై స్వేచ్ఛను కోల్పోవటం పార్టీల ద్వారా పక్షాల ద్వారా జరుగుతున్నది. ఈస్థితి తొలగి కవి మనుష్యుడైతే తప్ప సమగ్ర మానవజీవన విధాన ప్రతిఫలనం కావ్యాల్లో చెలరేగే అవకాశం ఉండదు.

రాను రాను కవులు తమ తమ కావ్యాలను తామే పఠించుకోవలసి వస్తున్నది. ఇందుకు కారణం సార్వత్రికంగా కవిత్వం లేకపోవడమే. కవి వ్యక్తిగతానుభూతికి కావ్యరూపమిచ్చి పాఠకులకు దూరంగా సంచరించడం. అదీగాక చదివేశక్తి ఉన్న పాఠకులు కూడా కవులేకనుక ఇతర కవుల రచనలను చదవక పోవడం లేలికగా కొట్టి పారెయ్యడం శోచనీయం. అంటే సహృదయ లక్షణం కవితలలో కొరవడడం. ఇది పెద్ద ప్రమాదం.

ఇవాళ పఠితలు కూడా పాక్షికంగా తయారైనారు. ఉదాహరణకు శ్రీశ్రీ కవిత్వాభిమాని ఉన్నాడు. అతనికి ఆ కవి తప్ప ఇంకే అభ్యుదయకవిదైనా సద్భావన ఉండదు. లేదా అంతశక్తివంతంగా ఇతరకవులు రాసినా మెచ్చడు. మరికొందరు పాఠకులు ఉంటారు. అభ్యుదయ విశేషణం ఉన్న కవులరచనలనే చదువుతారు. వారి దృష్టిలో విశ్వనాథాదులు కవులు కారు. ఇస్మాయిల్ కావ్యాలు కావ్యాలేకావు. తామునుట్టిన కుందేటికి మూడేకాళ్ళు, ఇది కేవలం పార్టీలవారికనే కాదు వాటితో ప్రమేయంలేని మరికొందరికికూడా. అయితే తోటి కవుల్ని, ఎదుటికవుల్ని వారి వారి కావ్యాల్ని నిశితంగా సహృదయతతో చదివే లక్షణమే నెలకొనవలసిఉంది. చదవలేనివాడు, చదివేశక్తి కోల్పోయినవాడు అకారణ ద్వేషంతో కొన్ని ఉత్తమ కావ్యాలకూ పాఠకుడు దూరమై సాహితీవిలువలను గుర్తించని వాడవుతాడు.

పాఠకులు నేడు తమ స్థాయిని పెంచుకునే కృషిచేయకపోతే కవిత్వం అర్థం చేసుకోలేకపోతారు. కవులుకూడా మరీ చిక్కగా అల్లకుండా కాస్త సరళశైలికి దిగాలి. సింబాలిజాల వంటి యిజాల పేరుతో పాఠకునికి చిరాకు కలిగించడానికి సిద్ధం కాకూడదు. ముఖ్యంగా కవులు సుదీర్ఘ ఖండికలు వ్రాయటానికి బదులుగా సూటిగా క్లుప్తంగా వ్రాయటం ఆకర్షణీయంగా అవశ్యపఠనీయంగా కవిత్వాన్ని తీర్చిదిద్దటమే అవుతుంది.

ఆధునిక కవిత్వం విషయంలో కవీ పాఠకులూ ఒక వేదిక మీదికి రాగలగాలి. ప్రతికవీ పాఠకుడైనవాడు, ప్రతి పాఠకుడూ సహృదయుడైన విమర్శకుడైనవాడు కవిత్వం రసమయంగా తన స్వరూపాన్ని సాక్షాత్కరించుకోగలదు.

0—0

## 2. బలివాడ నవలా సింధూరం 'సుధామధురం'

—డాక్టర్ గజ్జా యోహన్‌బాబు

కళింగాంధ్ర నవలా రచయితల్లో రాశిలోనేగాక వాసిలోనూ ఎన్నదగిన మన్నికైన నవలలు రచించిన నవలాశిల్పి బలివాడ కాంతారావుగారు. 1986 డిసెంబరు నెల 'ఉదయం' వారపత్రికకు అనుబంధ నవలగా వెలువడింది కాంతారావుగారి 'సుధామధురం' నవల. ఇది ఓ సందేశాత్మక నవల. ఆస్తవ్యస్తవ్యవస్థలో ఆధునిక మానవుని జీవితగమనంలో రచయిత చూపించిన దిక్సూచికి ప్రతీక ఈ నవల. 'ఏతత్త్వమైనా ఏ యిజమైనా కొన్నాళ్ళే వెలిగి తర్వాత ఆ దీపం కొడిగడుతుంది. దాన్ని తొలగించిమళ్ళీ ఈనాటి నూనె పోసి ఎవరో వెలిగించాలి' అన్న నేపథ్యంలో వెలువడింది నవల.

"ఎంత సారవంతమైన భూమైనా దున్నకపోతే వ్యవసాయక్షేత్రం కాదు. కాలగతిలో మొక్కలు వెర్రితలలు వేస్తాయి. నిష్ఫలమైన ఆ భాగాన్ని కోసివేస్తే మళ్ళీ ఆ మొక్కలు బాగా పుష్పించి ఫలిస్తాయి. ముళ్ళపొదలు నరికివేస్తే తోటకు వికాసమొస్తుంది. కలుపు తీసిన మడి ఏపుగా బలంగా పెరుగుతుంది. మానవసంఘంలో కూడా కొన్ని సదాచారాలు సైతం కొన్ని తరాలకు కరడుకట్టి మానవత లోపించడంవల్ల దారుణమైన దురాచారాలుగా పరిణమిస్తాయి. నైతికదృష్టి మాంద్యం ఏర్పడినపుడు సమాజజీవితం దుర్గంధపూరితమౌతుంది. మనుగడ దుర్లభమౌతుంది. కాలానుసారంగా నూతన ఆచారాలపట్ల విలువల పట్ల దృక్పథం మార్చుకోక తప్పదు. అలాగని కొత్తదంతా మంచిదని నెత్తిన పెట్టుకొని ఊరేగడం తగదు. కొత్తపాతల మేలుకలయికతో మారిన విలువలతో జీవితగమనాన్ని సాగించడం వివేకశీలుర లక్షణం.ఆ దిశగా పాఠకుల్ని ఆలోచింపజేసి ఆచరణకు పురికొల్పుతుంది బలివాడ వారి ఈ నవల.

'సుధామధురం'నవలలోని కథ చాలా చిన్నది. సీతారామయ్య అతని యిద్దరు కుమారులు, కుమార్తె, వారి యింటికి చుట్టపుచూపుగా వచ్చిన సుధ, వీరిమధ్య కథ నడుస్తుంది. సీతారామయ్య భార్య పోతుంది. అతడు రిటైర్డు ఉద్యోగి. సంప్రదాయవాది. పెద్దకొడుకు సుందరనారాయణ. పాశ్చాత్య సంస్కృతి అన్నా, సంప్రదాయాలన్నా మక్కువ ఎక్కువ. రెండోకొడుకు బలరాం హేతువాది. అంతకుమించిన సమతాదృష్టి కలవాడు. అతివాదిగా సమాజంచేత ముద్ర వేయించుకొంటాడు. కుమార్తె అరుణకు టెలిఫోన్ ఆపరేటర్ ఉద్యోగం. సాధా

రణ మధ్య తరగతి యువతికి ప్రతిబింబ మాయెను. ఈ నలుగురివి నాలుగుదారులు. ఒక్క కడుపులో పుట్టినవాళ్ళయినా వారిమధ్య ఆప్యాయతానుబంధాలు లేవు. మనది అన్న భావం ఏకోశానా లేదు. ఆడదిక్కు లేని కుటుంబం ఎంత హీనంగా తయారవుతుందో చూపడానికి ఈ కుటుంబమే నిదర్శనం. ఈ స్థితిలో వారి యింటికి వచ్చిన సుధ తానూ వారిలో ఒకటవుతూ వారికి జీవితవిలువల్ని బోధించి, కుటుంబజీవన మాధుర్యం చవిచూపిస్తుంది. పాతయిజాన్ని పట్టుకొని పాకులాడే సీతారామయ్యను సంస్కరించి కొడుకులపట్ల కూతురుపట్ల నిర్వహించవలసిన బాధ్యతలేగాక నూతనవిలువల్ని, ఆధునిక జీవన పోకడల్ని తెలిపి కళ్ళు తెరిపిస్తుంది. పాశ్చాత్య వేషభాషల్లో మునిగితేలుతూ ఆ సంస్కృతి ప్రవాహంలో కొట్టుకు పోతున్న సుందరనారాయణకు తానున్న దేశం తనదేశ పరిస్థితుల్ని గమనించేటట్లు చేస్తుంది. అంతేకాదు పెద్దకొడుకుగా యింటిబాధ్యతను స్వీకరింపజేస్తుంది. కుటుంబ సమస్యల్ని తండ్రితో చర్చించి పరిష్కారాన్ని కనుగొనేవానిగా చేస్తుంది. లోకం సమస్యల్ని తన సమస్యలుగానూ, దరిద్రనారాయణుల్ని తన తోబుట్టువులుగానూ భావించి సమాజాన్ని అనుక్షణం ఎదిరించే బలరాంని ఆలోచనాపరునిగానూ, కార్యశీలిగనూ తయారుచేస్తుంది. బాధ్యతాయుత పౌరునిగా మలుస్తుంది. ప్రేమ నవలలతోటి, రొమాంటిక్ సినిమాలతోటి కాలక్షేపం చేస్తూ ఊహాలోకాల్లో విహరించే అరుణను భూమ్మీదకు దించుతుంది. వాస్తవాన్ని గుర్తించేటట్లు చేస్తుంది. ప్రేమ వివాహాన్ని అంగీకరించలేని సీతారామయ్యను ఒప్పించి అరుణకు ఆమె ప్రేమించిన 'కొలీగ్' తో పెళ్ళి జరిపిస్తుంది. పాతకొత్తల సంఘర్షణలలో చిన్నాభిన్నమైన కుటుంబాన్ని తన చాకచక్యంతోనూ, నైపుణ్యంతోనూ సరిదిద్ది కొడిగట్టిన ఆ కుటుంబ వ్యక్తుల జీవితాల్లో జీవితవిలువల చమురుపోసి నూత్న కాంతులను వెదజల్లింది. కడకు బలరాం కోరికమేర అతని జీవితభాగస్వామియై ఆ కుటుంబంతో విడదీయరాని సంబంధాన్ని ఏర్పరుచుకొన్న 'సుధ' తన పేరును సార్థకం చేసుకొని ఆ కుటుంబానికి సుధామధుర రుచుల్ని చవి చూపింది.

ఈ నవల్లో రచయిత ప్రదర్శించిన 'సామాజిక స్పృహ' (సోషల్ ఎవేర్‌నెస్) ప్రశంసనీయమైంది. సీతారామయ్యలాంటి వృద్ధతరం వ్యక్తులు, సుందర్, బలరాం, అరుణలాంటి యువతరం పాత్రలు మనకు ఇంచుమించు ప్రతియింటిలోనూ తారసపడ్తాయి. నదీప్రవాహానికి ఆనకట్టవేసి సక్రమమైన దిశలోనికి మళ్ళించి పంటభూములకు మళ్ళించినప్పుడే ఆ జలాలకు సార్థకత. లేకపోతే అవి నిరుపయోగంగా సముద్ర జలాల్లో కలిసిపోతాయి. సీతారామయ్య కుటుంబాన్ని సరిదిద్దిన సుధ ఆనకట్టలాంటిది. వారివారి ఆలోచనల్ని, ఆశయాల్ని ప్రగతిపథం వైపు మళ్ళించి సమాజశ్రేయస్సుకు తోడ్పడింది. ఈనాడు ప్రతియింటికి సుధలాంటి ఓ వ్యక్తి అవసరం. అప్పుడు ఈ సమాజం 'సుధామధురం' అవుతుంది.

ఈ నవల్లోని కథను ఆధునిక భారతదేశానికి అందులోనూ భిన్నమనస్తత్త్వాలు గల్గిన వ్యక్తుల మానసిక ప్రవృత్తులకు ప్రతీకగా గ్రహిస్తే సుధపాత్ర ఆ వ్యక్తులమధ్య సమన్వయాన్ని సాధించి నూతనమార్గాన్ని నిర్దేశించిన వ్యక్తిగా పేర్కొనవచ్చు. సీతారామయ్యకుటుంబం స్త్రీ దక్షత లేనిది. అంటే గమ్యంలేనిది. వారి కుటుంబంలో ఎవరిదారి వారిది, ఎవరి ఆలోచనాదృక్పథం వారిది. సమన్వయం లోపించి కుటుంబం చిన్నాభిన్నమైంది. పాశ్చాత్య నాగరికతా వ్యామోహంలో ఒకడూ, అతివాద ధోరణిలో, మరొకడూ, ఊహాలోకాల్లో తిరుగుతూ యింకొకరూ, ఛాందస సంప్రదాయానుకరణ నిబద్ధుడై ఒకడూ ఎవరికి వారు తమ ఆలోచనలు, ఆచరణలూ ఉన్నతమైనవని, సక్రమమైనవని భావిస్తూ సమాజమూలచ్ఛేదనకు తమకు తెలియకుండానే సమాయత్తమౌతున్న దశలో సుధలాంటి 'రిఫార్మర్' లేక సంస్కారి అవసరం. 'పురాణమిత్యేవ నసాధుసర్వం, నచాపి కావ్యం నవమిత్యవద్యం' అని కాళిదాసు సూక్తి. పాతది ప్రతీది గ్రాహ్యంకాదు. అలాగని కొత్తదంతయూ పరిత్యాజ్యం కాదు. అందుకే 'పాతకొత్తల మేలుకలయిక క్రొమ్మెరుంగులు చిమ్మ'వలెనని గురజాడగారు అన్నారు. ఆ సమన్వయసిద్ధాంతం ఊపిరిగా సాగిన ఈ నవల ఖలివాడ నవలా శిల్పానికి, జీవితదర్శనానికి ఓ దిక్సూచి.

...•••...

అందమైన అచ్చుపనులు సకాలంలో కావాలంటే
B. V. & CO. ప్రెస్సును సంప్రదించండి.
RAJAHMUNDRY-1
మావద్ద హిందీ, ఇంగ్లీషు, తెలుగు భాషలలో ప్రింటింగు చేయబడును.

# 3. ఆర్యసమాజ స్థాపనకు మూలకారణం

—డాక్టర్ కె. పురుషోత్తం పాల్, ఎం.ఏ., పిహెచ్.డి.

'యదా యదాహి ధర్మస్యగ్లానిర్భవతి
భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం
సృజామ్యహం'

ఓ అర్జున, 'ధర్మగ్లాని జరిగినప్పుడు, ధర్మాన్ని పునరుద్ధరించేందుకు నే నవతరిస్తాను.'

ఆర్య సమాజం యొక్క అవతరణ - ధర్మగ్లాని జరిగినప్పుడు - జరిగింది. దాని స్థాపకుడు స్వామీ దయానంద సరస్వతి. సంఘములో అధర్మాన్ని రూపుమాపి, ధర్మాన్ని పునరుద్ధరించేందుకు కంకణం కట్టుకున్నాడు.

మనువు నాటి కాలాన్ని మనం ఒక్కసారి జ్ఞాపకం చేసుకున్నట్లైతే, అప్పటి ప్రజలు నాలుగు వర్ణాలుగా విభజింపబడియుండుట గమనిస్తాము. ఆ నాలుగు వర్ణాలవారు వారి వారి వృత్తులను కొనసాగిస్తూ ఉండేవారు. మీరు ఆస్తికులు (Theists). అయితే కొంత కాలానికి వామ మార్గీయుల ప్రవేశముతో పదార్థ వాదము (Materialism) వారి మనసులలో చోటు చేసుకున్నది. అప్పటి నుండి విగ్రహారాధన ప్రబలింది. విగ్రహాలకు మూగ జీవులను బలి ఇవ్వడం, మద్యం సేవించడం అనేవి మోక్షానికి మార్గం అని భావించి, వాటిని ఆచరించారు.

ఆ తరువాత మతం పేరిట మూగ జీవులను బలి ఇవ్వడాన్ని నిషేధిస్తూ బుద్ధుడు తన ప్రచారాన్ని ప్రారంభించాడు. దీనితో వామ మార్గీయుల ప్రభావం సన్నగిల్లింది. 'అష్టాంగమార్గము' ద్వారా అప్పటి ప్రజల మనసులలో బుద్ధుడు తనకంటూ ఒక స్థానాన్ని సంపాదించుకున్నాడు. అయితే బుద్ధుని బోధలలో 'దేవుడు, ఆత్మ' ల ప్రస్తావన అసలు లేనే లేదు. కాని సంఘం శరణం గచ్ఛామి, ధర్మం శరణంగచ్ఛామి, బుద్ధంశరణం గచ్ఛామి, అని ప్రబోధించాడు. ఆ తర్వాత వేద పండితులు శంకరాచార్యులు 'అహం బ్రహ్మాస్మి, తత్వమసి, సర్వం బ్రహ్మేతి వ్యజానాత్' అనే బోధతో రంగ ప్రవేశం చేశారు. వీరు 'దేవుడు లేడు' అనే బుద్ధుని వాదనను వ్యతిరేకించి 'సమస్తము దేవుని ప్రతిరూపమే' అని బోధించారు. శంకరాచార్యుల తరువాత మహమ్మదీయుల పరిపాలన ప్రారంభమైంది. వీరిద్దరికి మధ్య ఉన్న కాలాన్ని 'మధ్య యుగము' అని అంటారు.

మహమ్మదీయుల పరిపాలన ముగిసే సరికి ఆర్యుల మూఢనమ్మకాలు బాగా పెరిగిపోయాయి. ఆ తరుణంలో ఆంగ్లేయులు భారతదేశంలో ప్రవేశించారు. వీరి నాగరికతా ప్రభావం భారతీయులపై బాగా పడింది. క్రైస్తవ మిషనరీలు క్రైస్తవమతాన్ని వ్యాపింపజేయ పూనుకున్నాయి. ఏక దేవుణ్ణి నమ్మిన క్రైస్తవులు మన దేశంలోని బహుదైవత్వాన్ని వ్యతిరేకించి, హిందూమతంలో ఉన్న లెక్కలేనన్ని కులాలు, ఉప కులాలను విమర్శించారు. అలాగే వీరు సాంఘిక సమానత్వాన్ని ప్రబోధించారు. ఆధునిక, మతాతీతమైన విద్యను ఆంగ్ల భాషలో ప్రవేశ పెట్టారు. విద్యా సంస్థలను నెలకొల్పి వాటి ద్వారా క్రైస్తవ మతబోధ చేశారు. అయితే చాలా మంది ఆధునిక పాశ్చాత్య విద్యను అభ్యసించారు గాని, కొందరే క్రైస్తవులుగా మారారు.

ఆంగ్లేయులకు జాత్యహంకారం బాగా ఉన్నది. భారత జాతిని నిమ్నజాతిగా పరిగణించారు. మనదేశంలో అత్యమూల్య అపార ఖనిజ సంపదను స్వప్రయోజన నిమిత్తం పాశ్చాత్యదేశాలకు ఎగుమతి చేసుకున్నారు. తయారయిన వస్తువులను తిరిగి మన చేత కొనిపించారు. భారతీయుల సంక్షేమానికి ఆంగ్లేయులు ఏమాత్రం శ్రద్ధ వహించలేదు. దయానందుడు భారతదేశ స్థితిగతులను అవగాహన చేసుకోగలిగేటప్పటికి పై స్థితిలో భారత దేశం ఉంది.

సంఘములోని సాంఘిక దురాచారాలు, ప్రజలలోని నిమ్నతాభావం మరియు వారి ఆర్థిక వెనుకబాటుతనానికి దయానందుడు చలించి పోయాడు. వీటన్నిటిని దయానందుడు కేన్సర్ వ్యాధితో పోల్చారు. ఈ వ్యాధికి సరియైన వైద్యం చేసి సంఘమనే రోగిని రక్షించాలన్న దృఢనిశ్చయంతో దయానందుడు ఒక సంస్థను నెలకొల్పాలన్న నిర్ణయానికి వచ్చాడు. తాను నెలకొల్పే సంస్థ ద్వారా సామాజిక దుష్కృతులను పూర్తిగా నిర్మూలించగలనన్న నమ్మకం దయానందునిలో మెండుగా ఉన్నది. అయితే మిగతా సంస్కర్తల లాగా తాత్కాలిక నివారణ కాక అసలు వ్యాధి యొక్క మూలకారణం కనుగొని దానిని కూకటివేళ్ళతో పెకలించ తలచాడు. ఆయన చేసిన అన్ని ప్రసంగాలలోనూ మతము యొక్క స్ఫూర్తి (Spirit) ని ప్రబోధించాడు. మతములోని నిజాన్ని గ్రహించి దాని ప్రకారం నడుచుకోవాలి. అంతేగాని మూఢనమ్మకంలాగా గ్రుడ్డిగా

నమ్మకాలకీ నటుకంటిది కాదు, అని ఆయన నొక్కి చెప్పారు.

చతుర్వేదాలు జ్ఞాన భాండాగారాలు. భగవంతుడు తన వాక్కులను నేరుగా ఋషులకు తెలియజేసాడు. వాటిని ఋషులు గ్రంథాలుగా లిఖించారు. కావున నే వేదాలు అపౌరుషేయాలు అని అందరూ అంగీకరించారు. ఇది నిత్యమైన భగవంతునిచే చెప్పబడినవి. కావున ఇవియూ నిత్యమైనవి. వీటికి మించిన మరో గ్రంథరాజము లేదు. సర్వసమస్యా పరిష్కారము వీటిలో గలదు. వాటికి అవే సాటి. వేదాలలో ఉటంకించబడని జ్ఞానం మరిలేదు. భారతావనిలోని మతం, నాగరికతా సంస్కృతులకు ఈ వేదాలే మూలమని దయానందుని వాదన. విగ్రహారాధన, మూఢ నమ్మకాలకు వేదాలలో తావు లేదు. తప్పుడు ప్రచారాలే వీటికి కారణం. అయితేనేం, వేదాల వెలుగులో వాటిని పూర్తిగా పారద్రోల గలనన్న నమ్మకం దయానందునికి మెండుగా ఉంది.

అయితే మొదట్లో దయానందుని చికిత్స రోగికి ఎంత మాత్రం ఇష్టంలేదు. ఎందుకంటె అప్పటి వరకు తాము ఆచరిస్తున్న బహుదైవత్వం, విగ్రహారాధన, మూఢనమ్మకాలను దయానందుడు పూర్తిగా విస్మరించమన్నాడు. (పొగ త్రాగడం మంచిదికాదని అందరికీ తెలుసు. కాబట్టి 'పొగత్రాగడం ఆరోగ్యానికి హానికరం' అని ప్రభుత్వం కొన్ని కోట్ల రూపాయల ఖర్చుతో ప్రచారం చేస్తుంది. అయినప్పటికీ ప్రజలు పొగ త్రాగక మానరు) అట్లే దయానందుడు కష్టాలను ఎదురీదుతూ, తన సిద్ధాంతాలను త్రోసి పుచ్చేవారు ఎందరున్నా ప్రజలను ఉత్తేజితులను చెయ్యాలన్న సంకల్పంతో 1875, ఏప్రిల్ 10 వ తేదీన బొంబాయి నగరంలో 'ఆర్య సమాజాన్ని' స్థాపించాడు. ప్రస్తుతం దాని శాఖలు భారత దేశం అంతటా వ్యాపించి యున్నవి.

దయానందుడు తాను నమ్మిన సిద్ధాంతాలను ప్రచారం చేస్తూ, 'తిరిగి వేదాల వైపుకి వెళ్దాం' (Back to Vedas) అనే నినాదంతో సంఘాన్ని సంస్కరించేందుకై ఆర్య సమాజాన్ని స్థాపించి అప్పట్లో కొంతవరకు కృతకృత్యులయ్యారు. అయితే ఆ సమస్యలు అంతటితో సమసి పోలేదు. పాత సమస్యలతో పాటు వరకట్నం, అశాంతి వంటి క్రొత్త విపత్కర సమస్యలతో ప్రస్తుత ప్రపంచం సతమతమౌతున్నది. ఇట్టి విపత్కర పరిస్థితులలో ఉన్న ప్రపంచాన్ని శాంతి మార్గంలో నడిపించేందుకు దయానందుని లాగా సంఘ సంస్కరణాభిలాషులమై మనమూ పాటుపడదామా !!

(000)

# ప్రమోదూత

...డా॥ చేరెడ్డి మస్తాన్ రెడ్డి

ప్రమోదంబుతో వేవచ్చుచున్న గొమ్మా!
ప్రమాతల్ మదిన్ మెచ్చు భాగ్యంబు నిల్పన్
ప్రమాదూతవై ధ్వాంతభారమ్ము జీల్పన్
ప్రమోదూత సంవత్సరా! రమ్ము, రమ్మా!

శుక్ల రక్త సిక్తమై క్లేశమును గూర్చె
విన్న యెన్నికలను నిల్పినట్టి
ఉగ్రవాదులను మతోన్మాదులను మాపి
యా మతాల చేయు నల్లరులకు.

ప్రజల మోసగించి పాలన మొనరింప
దలచువారు పాటు పలచువారు
వాట మెఱిగి విల్ల వీటుగా పసగొట్టు
తెలివి గలుగువారు తెలుగువారు.

తొలగిపోవలె నిరుద్యోగులౌ యువజనుల్
నిడుచు నిట్టూర్పుల నెచ్చరవము
తొలగిపోవలె లంచములకు పట్టుబాపు
అధికారి గణముల యధమగుణము
తొలగిపోవలె సమాత్యుల శాస్త్రల విధాన
నాడించు పెద్దల యాగడములు
తొలగిపోవలె ఋత్విజుల కిరీటము సల్ప
గొని తెచ్చుకొనుచున్న గ్రుడ్డితనము

తొలగిపోవలె పార్టీల కులము లనుచు
గ్రుమ్మకొనుచున్న దున్నల క్రొవ్విదములు
వెలిగి పోవలె ప్రజల హృద్వీథులందు
చదువు సంజల తోడ సంస్కారబలము.

అభిమన్యుండును బాలచంద్రుడును ఆ
అల్లూరియుం బౌరుష
ప్రభలుప్పొంగగ నైకమత్యమునకై స్వాతం
త్ర్యసంసిద్ధికై
యిభముల్ బోలె బెనంగి కీర్తి గనినా రీవేళ
ధీకొట్టుచు
న్న భిదావాద నృశంస దుర్మదము ప్రామందం
జేయ లెండుద్ధతిన్!

దవవైశ్వానరకీల లుగ్రముగ వ్యాప్తం బౌచు
కుష్కావనీ
జవితావంబును భస్మమున్ సలుపు నో జన్
సంఘ మందున్న దా
నవతన్ ధ్వంస మొనర్చి మానవతకున్
బట్టంబు గట్టించు మా-
నవశక్తిన్ యువశక్తి మెచ్చెదను
స్వాంతం బిచ్చి తప్పిబ్బగన్

శ్రీతరుణీమణీ మధురనృత్యము మీ గృహ
సీమలందు సం
ప్రీతిని గూర్చుతన్ సుఖసమీకృత పావన
జీవనంబు మీ
దైతసరారుగాత! కవితాంబుజ భాస్కరులార!
యీ ప్రమో
దూత యుగాది మీకు పకుతోభయతన్ దయ
సేయుగావుతన్.

(*.*)

# శారళా భారత (ఒరియా) సమీక్ష

విజయనగరం : గురజాడ స్మారక జిల్లా కేంద్ర గ్రంథాలయంలో సాహితీ మిత్ర సమాఖ్య విజయభావన 27-2-1990 మంగళవారంనాడు భారత భారతి అనే కార్యక్రమాన్ని నిర్వహించింది. ఖురదా రోడ్ కు చెందిన రిటైర్డు తెలుగు లెక్చరర్ - కవి సుధాకర, పరిశోధనా భూషణ డా॥ భళ్లమూడి నరసింహమూర్తి ప్రధానవక్తగా పాల్గొని, 'శారళా భారత (ఒరియా) సమీక్ష' అనే విషయంపై ప్రసంగించారు.

ఒరియావారి ఆదిమహాకవిగా ప్రసిద్ధి చెందిన శారళాదాసు అసలు పేరు సిద్ధేశ్వర పరిడా అని చెబుతూ 'పరిడా' కుటుంబానికి చెందినవారు వ్యవసాయ వృత్తిలో వుంటూ, యుద్ధసమయాల్లో కత్తిపట్టి సైనికులుగా వ్యవహరించగల ధైర్యశాలురని డా॥ భళ్లమూడి నరసింహమూర్తి వివరించారు. సరళాదేవత అనుగ్రహం వలన నిరక్షరకుక్షి అయిన సిద్ధేశ్వర పరిడా కవిత్వం చెప్పగల మహా పండితునిగా మారటం వలన అతను సరళదాసు (శారళాదాసు)గా వ్యవహరించబడ్డాడని డా॥ నరసింహామూర్తి తెలియజేశారు. శారళాదాసులో పోతన భక్తితత్త్వం; వీరశైవులమత తీవ్రత కనిపిస్తాయని డా॥ నరసింహామూర్తి చెప్పారు. శారళాభారతం ఒరియా సమాజ సంస్కృతీ సంప్రదాయాలను ప్రతిబింబించే గొప్పగ్రంథంగా ఆయన అభివర్ణించారు. ఆ గ్రంథం వ్యాసభారతానికి ఏమాత్రం అనువాదం కాదని డా॥ మూర్తి చెబుతూ, పాత్రల సంబంధాలను చెప్పటంలోను, కథాసన్నివేశ కల్పనలలోను శారళాదాసు పూర్తి స్వేచ్ఛను ప్రదర్శించాడని ఆయన వివరించారు. మనభారతంలో వున్నట్లు పర్వానుక్రమణిక కూడా శారళాభారతంలో లేదని డా॥ మూర్తి స్పష్టంచేశారు.

గంగాశంతనుల వివాహఘట్టంలోను; భీష్మప్రతిజ్ఞ; లాక్షా గృహనిర్మాణం; ద్రౌపదీ వస్త్రాపహరణం; రాజసూయయాగం మొదలైన సందర్భాల్లో శారళాదాసు చిత్రవిచిత్రమైన కల్పనలు చేసాడని డా॥మూర్తి విశదీకరించారు. శారళాభారతంలో శకుని మహామేధావిగా, అపారప్రజ్ఞాశాలిగా కనిపిస్తాడనీ; శ్రీకృష్ణుడు ఒకానొక సందర్భంలో 'నవకుంజరము' అనే ఒక విచిత్రమైన జంతువు రూపం ధరించాడనీ డా॥ మూర్తి వివరించారు. భీమ, దుర్యోధనుల పాత్ర చిత్రణలో, ద్రౌపది పాత్రచిత్రణలో శారళాదాసు తన ప్రత్యేకతను చాటుకున్నట్లు ఆయన చెప్పారు, శారళాదాసు సైనిక వృత్తిలో కూడా వుండటంచేత యుద్ధ వర్ణనలను అద్భుతంగా చేసినట్లు డా॥ మూర్తి చెప్పారు.

కాళిదాసు విరచిత రఘువంశ ప్రభావం; జయదేవుని గీతగోవిందం ఛాయలు శారళాభారతంలో వున్నట్లు డా॥మూర్తి చెబుతూ ఈ గ్రంథాన్ని ఒరిస్సాలో పూజామందిరాల్లో ఉంచుతారనీ; శారళాదాసు వర్ధంతి సభలు జరిపే ఆచారం ఒరిస్సాలో ఇప్పటికీ వున్నదనీ వివరిస్తూ డా॥ మూర్తి తన ప్రసంగాన్ని ముగించారు.

ఈ సభకు అధ్యక్షత వహించిన ప్రముఖ ప్రవాసాంధ్రకవి శ్రీ వజ్ఝల కాళిదాసు మాట్లాడుతూ, శారళాభారతంలోని కథలు వినటానికి ఆసక్తికరంగా వుంటాయనీ; డా॥ నరసింహమూర్తి ఆ కథలను క్లుప్తంగా, ఆసక్తికరంగా చెప్పి మెప్పించారని ప్రశంసించారు.

శ్రీకాకుళం జిల్లా-పైడి భీమవరానికి చెందిన తెలుగు పండిట్ మరియు విజయభావన ఉపాధ్యక్షుడు శ్రీ రాళ్ళపల్లి రామసుబ్బారావు ప్రధానవక్త డా॥ భళ్లమూడిని పరిచయం చేస్తూ, కవిగా-పరిశోధకునిగా ఆయనకృషి అసామాన్యమూ, ఆదర్శవంతమూ అయినదని సోదాహరణంగా వివరించారు. డా॥ భళ్ళమూడి వచనరచనలో కూడా దిట్ట అని చారిత్రక - పౌరాణిక గాథల్ని వివరించటంలో ఎంతో నేర్పును ప్రదర్శించారని శ్రీ రామసుబ్బారావు కొనియాడారు.

విజయనగరం-బాలాజీనగర్ కు చెందిన 'పబ్లిక్ స్కూల్' ప్రెసిడెంట్ మరియు కరస్పాండెంట్ అయిన శ్రీ ఎం. వి. సత్యనారాయణమూర్తి తమ ఉపాధ్యాయ బృందం తరఫున ప్రధానవక్త డా॥ భళ్ళమూడిని శాలువా, పూలమాల, మెమెంటోలతో ఘనంగా సన్మానించారు. వేదికపై పాల్గొన్న సాహితీవేత్తలందరికీ ఆయన జ్ఞాపికలను బహూకరించారు. శ్రీ సత్యనారాయణమూర్తి అభినందన ప్రసంగం చేస్తూ, ప్రతిసంవత్సరం ఒక సాహితీవేత్తను సన్మానించే అవకాశాన్ని విజయభావన వారు తమకు కలిగించాలని కోరారు.

విజయభావన సహాయకార్యదర్శి శ్రీ పంతుల దక్షిణామూర్తి ప్రసాద్ ప్రార్థనతో ప్రారంభమైన ఈ సభకు ప్రధానకార్యదర్శి డా॥ ఎ. గోపాలరావు స్వాగతం చెప్పారు. కార్యదర్శులు శ్రీ కె. మార్కండేయులు సందేశాలు చదవగా, శ్రీ పి. వి. యల్. సుబ్బారావు వందన సమర్పణ గావించారు.

....ఆచార్య భావన

—0—

## 4. సాహిత్య మొర్మొరాల్లో తాపీవారి పనితనం

—శ్రీ వి. రాంబాబు, ఎం.ఏ.(లిట్)

ఆంధ్ర సాహితీ ప్రపంచంలో విమర్శకులుగా, సుప్రసిద్ధులు శ్రీ తాపీ ధర్మారావు. విజయ విలాసానికి ఆయన వ్రాసిన హృదయోల్లాస వ్యాఖ్య రసజ్ఞులను అలరించింది. ఇనుప కచ్చడాలు, దేవాలయాల మీద బూతు బొమ్మలు, పెళ్ళి-పుట్టుపూర్వోత్తరాలు వంటి రచనలు ఆయన సునిశిత దృష్టికి, మంచి ఆలోచనా సరళికి నిదర్శనాలు. అలాగే ఆయన సాహిత్య మొర్మొరాలు ఆంధ్ర పాఠక లోకానికి అపూర్వమైన కానుక అని చెప్పవచ్చు.

ఇందులో ప్రాచీన కవులైన నన్నయ నుండి చేమకూర వేంకటకవి వరకు గల ఆంధ్రకవులను పరిశోధకుల మూలంగా వచ్చిన అపప్రథలు, అతిగౌరవాలు గ్రహించి సరదాగా చదువుకుంటూ, తీవ్రంగా ఆలోచించడానికా అన్నట్లు చిన్న చిన్న వ్యాసాలు వ్రాశారు. మొర్మొరాలు లాగే తినడానికి తేలికగా ఉంటూ తినే కొలది ఇంకా ఇంకా తినాలనిపించే విధంగానే రుచివంతంగా, రసవంతంగా ఉన్నాయి ఈ వ్యాస పరంపరలు.

కృష్ణుడి శిరమును సత్యభామ తన్నిందా? అనే వ్యాసంలో లోకంలో మనం అనుకునే విధంగా తన్నలేదని, తొలగించిందని వివరించారు. దాన్ని దొంగకృష్ణుడు తాపీగా వక్రించాడని వివరించారు తాతాజీ. అలాగే 'ఆంధ్ర కవులు-అంటురోగాలు' అనే వ్యాసంలో కవుల నిందను ఒక సామాన్య ధర్మంగా భావించి అందరూ ఒకే బాటలో ఎలా నడిచారో వారి పోకడలెలా ఉన్నాయో వివరించారు.

కావ్యాల్లో ఉండే పువ్వులాటల వర్ణనలో ఉండే చిత్ర విచిత్రాలు, మంచి చెడులను సరస సౌందర్యంగా బాగా వివరించారు 'పూల-బజారు సరసాల్లో.'

'తాతా మనుమల సమీక్షలో అల్లసానివారి వర్ణనలోని ఔచిత్యానౌచిత్యాలు వివరిస్తూ కవిత్వం అంటే ఏమిటని ప్రశ్నిస్తారు హుందాగా. అదే విధంగా లోకోక్తులు-ప్రయోగాల్లో ఉన్న అందం, రసజ్ఞత ఆవశ్యకత-అందులోని చేమకూరి ఘనతను విశ్లేషించి చూపారు. సరసంగా, హృద్యంగా, 'వడమంత్రపు నీరు' అనే లోకోక్తిని ఎంత అందంగా హుందాగా బిగించారో తెలియ చెప్పారు తాతాజీ.

మా దేవుళ్ళు-ముచ్చట్లలో అల్లసాని వారు అలా అలా ఏడ్చాడనే కంటే అల్లి బిల్లిగా ఏడ్చాడనటం బావుంటుందన్నారు. మిగిలిన ఏడుపులు చాలా బాగున్నాయన్నారు. 'తార-వరూధిని'లో వరూధినికన్నా తార ప్రవర్తనే గొప్పదని ఆమెను చౌకగా ఎందుకు విమర్శకులు భావించారోనని బాధపడ్డారాయన.

మొత్తం మీద ఈ వ్యాసాలు ఆంధ్ర సాహిత్యాన్ని మరువకుండా కలకాలం నిలబెట్టాలని ఆ ఘట్టాలను అందరూ పదే పదే స్మరణ తెచ్చుకోవాలనే ఉద్దేశ్యంతో వ్యావహారికంలో సరదాగా వ్రాశానని ముందే చెప్పుకున్నారాయన.

కాని చాలమంది పండితులకూ, పాఠకులకూ సాహితీ పరిచయం గల వారికి కూడ ఈ వ్యాస పుష్పాల నుంచి సౌరభాలను సుబోధింప చేస్తాయని అనవచ్చు. ప్రతి వ్యాసం ఎత్తుగడ సామాన్యంగా ఉండి, పూర్తయేసరికి మనకు ఇంతకు ముందే ఉన్న నిర్ణయం పటాపంచలౌతుంది.

ఆంధ్రులు ఆంధ్ర సాహితీ పరిచయం ఉన్న ప్రతివారూ చదువ వలసిన ఈ పుస్తకం 1961 నుండి 1982 నాటికి 118 ప్రచురణలు పొందిందంటే దీని గొప్పతనం వేరే చెప్పనవసరం లేదు.

—0—

## నర్తకి

—శ్రీ పోలేపెద్ది రాధాకృష్ణమూర్తి.

నీ వదన విధుబింబమ్ము వీక్షించినంత
రంగసీమయు మా మనో రంగములను
నంధకార బంధుర మయ్యె నబ్జ వదన!
నీవు తిరిగి వచ్చిన యంతనే వెలింగె.

అంత దూరమ్ము నుండి నీ పతివయింపు
సాత్వికాభినయమ్ము విస్పష్టముగను
మాకుఁ గనిపించె; నీ కిట్టి మహిత శక్తి
యెట్టు లబ్బెనో! పూర్వ సుకృతము గాక!

భరతముని నాట్యశాస్త్రమ్ముఁ బదము లందుఁ
గటి ప్రదేశము, మధ్యము, గరము లందు
ముఖము నందును నిల్పిన ముద్దుగుమ్మ!
నీకు దీటైన నర్తకి నీవె సుమ్మి!

కొమరగిరి లకుమాదేవి కొలువుఁ, గృష్ణ
దేవరాయలు చిన్నమదేవి కొలువు
గద్దెలఁ దృణీకరించిన కారణమ్ము
నేఁడు మా కవగత మాయె నీరజాక్షి!

నిన్ను సౌందర్యరాశిఁ గన్న యట్టి
తల్లిదండ్రులు నిజముగా ధన్యులైరి
నాట్య భారతిగాఁ దీర్చినారు గురులు
నతని విద్యయుఁ జరితార్థ మయ్యె జగతి.

# 5. దండకాలు - చాటుకృతులు

—శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు

లాక్షణికులు కావ్య ప్రక్రియా భేదము లయిన ముక్తకాదికములను చాటు ప్రబంధాలుగా పరిగణించినారు. దండకాలు కూడా చాటుకృతులుగా పరిగణింపబడ్డాయి. విన్నకోట పెద్దన్న (15 వ శతాబ్దం పూర్వార్ధం) తన కావ్యాలంకార చూడామణిలో ఈవిషయం ఇట్లు చెప్పినారు-

కం. ఛందోభవ లక్షణగణ
సందోహ విబద్ధయగుచు శ్రవణానందా
మందామ ప్రాసంబుల
వందంబగు 'దండకము' మహాకవి
కృతులన్. - (4-42)

కం. ఇవి యెల్లను నానావిధ
కవి కృత కావ్యములచేత గర్భితముల పె
క్కు విధంబుల 'చాటుకృతి
ప్రవరంబులు' పరగు నెఱుగబడు
నొందెదలన్. - (4-43)

చాటుకృతులు (దండకాలుకూడ) హెచ్చు గుణములు కలవిగా ఉండవలెనని భావాన్ని పెద్దన్న ఇట్లు చెప్పినాడు-

సీ. అపూర్వ లక్షణోదాహరణావలి
యుల్లంబునకు విందు నొసగదేని
బిరుదావళీముఖ్య వృథుల ప్రబంధామ
ములు దిగంతంబుల ప్రోయనేని
పటు చతుర్భద్రాది భవ్య చాటూక్తులు
నృపతుల పీఠుల నిండవేని
మధురార్థ 'దండక' మంజీర మంజుల
ధ్వనుల నింపుల మీరి యివ్వదేని

తే. గీ. గెరలిచని ముక్తకాదులు కీర్తితల
ఇక్షవాక్యాది మీటికి జావవేని
గరగి మెచ్చునె యెకపాటి గంటదాటు
చాటుకృతులకు విశ్వేశ చక్రవర్తి
- కావ్యాలంకారచూడామణి, 4-44

ఒకపాటి గంటదాటు చాటుకృతులను విశ్వేశచక్రవర్తి మెచ్చడని చెప్పినాడు పెద్దన్న. గుణములు లేకుండిన వాటిని అభిజ్ఞులెవరైనను మెచ్చరు. చాటువులుకాని ప్రబంధాదులను మాత్రం గుణరహితములయిన వాటిని మెచ్చుతుంటున్నామా? చాటువులన్నీ మంచివని అంటున్నామా? చాటువులుకానీ తదితరములుకానీ గుణములుండినవే కోవిదులు మెచ్చుతుంటున్నారు.

చాటువులు సంఖ్యాబద్ధములు, సంఖ్యారహితములు అని రెండు తెగలుగా అప్పకవి చెప్పినాడు. అందు దండకాలు సంఖ్యారహిత చాటువులుగా చెప్పబడ్డాయి. అప్పకవి చెప్పిన ఆ పద్యాలివి-

కం. కనుగొన సంఖ్యా బద్ధం
బు నసంఖ్యాకంబు నాగ భువినిరుదెరగై
తనరారు బూర్వకవిమత
మున నా చాటుప్రబంధములు జలజాక్షీ
- అప్పకవీయం, 1-132

తే. గీ. నాల్గుదెగల యుదాహరణముల ముక్త
కాది పంచాదశమును సంఖ్యాన్వితములు
గద్య రగడ ద్విపద 'దండకములు' మంజ
రులును సంఖ్యారహిత చాటువులు
నృసింహా. - అప్పకవీయం, - 1-133

పై లక్షణముల ననుసరించి దండకాలన్నీ చాటువులనె చెప్పాలి. (గ్రంథాంతర్గతములగు కొన్ని దండకాలుతప్ప), చాటువనగా ప్రియమైనమాట. మరి దీనికి రాజాదిస్తుతివాక్యము, మిథ్యా ప్రియవాక్యములోనగు అర్థవిశేషాలున్నాయి. స్తోత్ర ప్రాయమగు పద్యం చాటుపద్య మందురు (దండకాలు అధిక కాలం స్తోత్రప్రాయాలే అగుట గమనార్హం) వినువారి హృదయానికి చమత్కార మొదవించి ఉత్సాహాన్ని పుట్టించే పదముల కూర్పు గల పద్యాలు చాటుపద్యా లనబడుతవి. దండకాలను చాటుకృతులుగ పూర్వలాక్షణికులు చెప్పడాన్నీ, చాటువుల లక్షణాలనూ పరిశీలిస్తే దండకాలు ఈ క్రింది లక్షణాలు కూడ కలిగి ఉంటాయని గమనింపవచ్చును - ఆశువులుగా ఉండటం, స్తోత్రపరములుగా ఉండటం, నిందాపరములుగా ఉండటం, చమత్కారయుతంగా ఉండటం, వర్ణనాత్మకంగా ఉండటం, గాథలుగా ఉండటం, ముక్తక లక్షణలక్షితాలై ఉండటం, శృంగారాత్మకాలుగా ఉండటం. ప్రతి దండకం ఈ లక్షణాలలో కనీసం రెండింటినైనా కలిగి ఉంటుంది.

పై లక్షణాలు గల దండకాలకు కొన్ని ఉదాహరణములు.

ఆశువులు: తిరుమల బుక్కపట్టణం కిరీటి వేంకటాచార్యులు చెప్పిన హయగ్రీవ దండకం, తిరుపతి వేంకటకవులు కీర్తంపూడిలో చెప్పిన దేవీనవరాత్రోత్సవ వర్ణనా దండకం, పోకూరి కాశీపత్యవధానులు మద్రాసులో అవధానసభలో కాపీ ధర్మారావుగారు కోరగా చెప్పిన కాఫీదండకం మున్నగునవి. ఇంకా దైవస్తుత్యాత్మకములగు అనేక దండకాలు ఆశువులుగా చెప్పబడ్డవే.

స్తోత్రపరములు: పరమేశ్వర, సూర్య, ఆంజనేయాది భగవన్నుతి పూర్వకములయిన దండకాలన్నీ స్తోత్రపరమగు దండకాలే. తెలుగులోగల గ్రంథాంతర్గత దండకాలలో అధిక శాతం ఈ కోవకు చెందిన దండకాలే. ఇవన్నీ దైవస్తుత్యాత్మకములు. ఇక మానవ స్తుత్యాత్మక దండకాలూ ఉన్నాయి. ఆళ్వారు దండకము, యతిరాజదండకము, గాంధీ మహాత్మ దండకము, పుదుకోట రామచంద్రమహారాజ దండకము, పుష్పగిరిస్వామి

దండకము, రాఘవేంద్రస్వామి దండకము. సత్యసాయిబాబా దండకము మున్నగునవి మహనీయ మానవస్తుత్యాత్మక దండకములు.

విందావరములు: పోలిశెట్టి వేకంట రాయకవి రచించిన తిట్ల దండకం, చిన వెంగన్న రచించిన మంగమ్మ దండకం (ఇది బూతు దండకం) మున్నగునవి విందా వరములగు దండకాలకు ఉదాహరణములు.

చమత్కారయుతములు: జమాబంది దండకం, దోపిడీ దండకం, ధూమశకట దండకం, పొగాకు దండకం, సిగరెట్టు దండకం, కాఫీదండకం మున్నగునవి చమత్కార యుతములు, అష్టభాషా దండకం, చిత్ర కవితా పరిపూరకమగు దండకాలు మున్నగునవి కూడ చమత్కారయుతములే, హాస్య రసాత్మకములగు భాషీయదండకం, వకీలు దండకం, లోభులు చదివే లక్ష్మీదండకం, బ్లాకుమార్కెట్టు దండకం, ప్రేయసీదండకం ఇత్యాదులు కూడ చమత్కారయుతాలే.

వర్ణనాత్మకదండకాలు: శ్రీమద్వేంకటేశ్వర దండకం పీపుల్సుపార్కు అగ్నిప్రళయ దండకం, శ్రీరామదండకం, మందర కాండ దండకం మున్నగునవి ఎన్నోకలవు.

గాథలు: రామాయణదండకం, జగన్నాథ మాహాత్మ్య దండకం, వేంకటాచల మాహాత్మ్య దండకం, శ్రీరామదండకం, దశావతారదండకం మున్నగునవి.

ముక్తకాలు: అనిబద్ధములు. శ్రవ్యములు, క్రియాసమాప్తికై పద్యాంతరంతో సంబంధంలేకుండ రసభావాదులతో ఉండేవన్నీ ముక్తకాలే. ఇంచుమించు దండకాలలో ఏదో కొన్ని తప్ప అన్నీ ముక్తకాలే.

శృంగారాత్మకములు: శృంగారిదండకం, కాళహస్తీశ్వర దండకం, భోగినీ దండకం, విద్యావతీ దండకం, చంద్రాననా దండకం, జగన్మోహినీ దండకం, శ్రీకృష్ణలీలలు దండకం ఇత్యాదులన్నీ శృంగార రసాత్మక దండకాలకు ఉదాహరణలు.

పై అంశములనుబట్టి దండకాలు చాటు కృతులని తెలుస్తోంది. ఇక్కడ మరో విషయం ప్రస్తావించటం సందర్భోచితమని భావిస్తాను. 'చాటుః' అనే సంస్కృత పదానికి తత్సమ రూపం 'చాటువు', సమాసమునందు ఉత్తరపదంలోని విభక్తి ప్రత్యయం 'వు' లోపించి 'చాటు'గా మారుతుంది. ఉదా: చాటుపద్యాలు, చాటుకృతులు. 'చాటువు'లోని 'చకారం' తాలవ్యం. ఇక్కడ 'చాటు' అనే అచ్చతెనుగుపదంలోని చకారం దంత్యము. కనుక, చాటు=మరుగు అనే అర్థం వస్తుంది. దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు చాటుపద్యాల సేకరణలో ఒక కరణంగారిని కలిసినపుడు ఆయన 'ఈ చాటు కవిత్వమును మీ వెలా బహిరంగ పరచెదవయ్యా' అని కోపపడినాడట. ఆ కరణంగారు 'చాటు' పదాన్ని అచ్చికంగా గ్రహించినారు. చాటు కవిత్వంలోని శృంగారదూషణాత్మక, బూతులు కొన్నిపట్ల చాటుగా చదువుకోవలసిందేగాని సభ్యసదస్సులో పఠనీయాలు కావు. అట్టి బూతు దండకాదులను చాటుదండకాలనడం ఉభయత్ర సార్థకంగా ఉంటుంది. బూతులబుంగ అయిన మంగమ్మ దండకం అందుకొక ఉదాహరణము.

—0—

## కవిసమ్రాట్ విశ్వనాథ!

—శ్రీ పంతుల దక్షిణామూర్తిప్రసాద్

ఆంధ్ర గీర్వాణాల నధికారముగ్ గల్గి
కవిరాట్టునుండన్న ఖ్యాతినొంద
రామాయణమ్మునే రచియించి తెలుగులో
కల్పవృక్షచ్ఛాయ కలిమి మించ
కలికి కిన్నెరసాని కాలియందెల మ్రోత
తెలుగింట వినిపింప తీర్చి కూర్చ
వేయిపడగలందు నాయకరత్నమై
వర్తించి యా విశ్వనాథుడయ్యె
కథల కావ్యాల వ్యాసాల కల్పనందు
సత్యనారాయణుండెన్న సద్యశోధి
మానవత్వంపు మూర్తి యామాను జాడితడు
తెలుగుసాహిత్య సమ్రాట్టు ధీరగుణుడు.

సీ॥ జాతీయ భావనల్ జాగృత మొనరింప
ఆంధ్ర పౌరుషమెంతో యలగజేసి
విష్ణుశర్మకు సాంగ్లవిజ్ఞానమును గూర్చ
హాస్యంబు సాంద్రముల కండజేసి
శృంగార వీథిలో జీవించి రసమయ
భావాల గీతాలు పాడిపాడి
భక్తివైరాగ్యాల పరమేశ్వర ధ్యాన
సంలగ్నహృదయుడై సంస్తుతించి
అద్భుతానంద శృంగార యమరభక్తి
నవరసంబుల నందించు కవనమందు.
సాటియెవ్వారు కలరోయి మేటినీవ
విశ్వ విఖ్యాతి నొందిన విశ్వనాథ!

చం॥ తనరెడు రెంత మెత్తనిదొ దానము చేయి తెల్పునం
జనిత మృదూక్తి భావనల సత్కృతు లెల్లెడ చాటి చెప్పనా
వినయమునెల్ల పెంద్రడి నుడి పీడక వ్రాసిన రామగాథయే
కనపడు సాక్ష ధర్మ మది కన్నుల గట్టుచు విశ్వనాథుడై

మ॥ అలనన్నయ్యను తిక్కనార్యునకు శేరస్మా దృకుల్ తిష్యలీ
కలిమిన్ వెంకటశాస్త్రి పావలన విఖ్యాతిన్ ఘనిన్ పొందనం
చలంఘుస్వాదు రసాను సంజనిత భావాత్మియతా చాతురిన్
పలుకన్ స్థైర్యము ధైర్యమేరికగునో బ్రాహ్మ్యస్వరూపోదయా!

సహజపాండిత్యకాంతిచే రహిని గాంచి
నిరుపమానంద సంధాన కరుణ కలిగి
జన్మ చరితార్థమొందిన శైవభక్త!
విబుధవందన మిదె గొమ్ము విశ్వనాథ!

(౦౦౦)

గొండ ఈశ్వరచరణ్ గారు ఈనాడు ప్రతిఒక్కరూ విమర్శకులేనని భావిస్తున్న వారిని చక్కటి సంయమనంతో ఇలా హెచ్చరించారు. 'ఈరోజుల్లో అవసరం ఉన్నా లేకున్నా, ప్రాచీన సాహిత్యం పైనా, సంప్రదాయం పైనా దుమ్మెత్తి పోయడం, అనాలోచితమైన అభిప్రాయాలను వెలిబుచ్చడం, కొత్త కాలమానాలతో నాటి కవిత్వాన్ని కొలవ బూనడం ఒక ఫ్యాషన్ అయింది' అని అంటారు. అంతే కాకుండా ఈనాడు వస్తున్న పుస్తక సమీక్షలు, విమర్శకుల పైన ఉన్న గాఢమైన అభిప్రాయాన్ని నిర్మొహమాటంగా ఇలా వ్యక్త పరిచారు. "ఈ నాడు అధ్యయనం, అవగాహన, ఆచరణ ఏమీ అక్కరలేదు. కొన్ని పాలిటిక్స్, వడికట్టు మాటలు పుక్కిట బట్టితే చాలు. వాడు గొప్ప సామ్యవాది. వాడు గొప్పకవి. గొప్పపండితుడు. ఈనాడు మేమూ గొప్ప అభ్యుదయ కవులమని, వాదులమని చెప్పుకుంటున్న వారిలో ఎంత మంది మార్క్సును అధ్యయనం చేశారో, ఎంతమంది ఫ్రాయిడ్ సిద్ధాంతాలను చదివారో, ఎంతమంది సార్త్రే పేరువిన్నారో సర్వే చేస్తే బండారం బయటపడుతుంది" అని అంటారు. ఈయన చెప్పదలచు కున్న విషయాన్ని నిక్కచ్చిగా చెప్పారు.

'కవిత్రయము - ద్రౌపది' అను వ్యాసములో తిక్కన, పోతన మనస్తత్వాలను పరిశీలించి, వారి ఘంటమునుండి ద్రౌపది ఎలా ఉద్భవించిందో, ఇద్దరి కలాలలోని ద్రౌపదికి ఉన్నటువంటి భేదమును చక్కగా విడమర్చి చూపిస్తూ ఇద్దరు మహాకవుల మనోవిశ్లేషణను చాలా విశ్లేషణలో మనకు చూపెట్టినారని చెప్ప వచ్చును.

'తెలుగు సాహిత్యంలో - గాంధీజీ' అను అంశంతో వ్రాసిన వ్యాసములో గాంధీయొక్క మహోన్నతను ఎంతమంది కవులు కొనియాడారో ఉటంకించారు. అంతేకాదు గాంధీని మనస్సుల్లో ప్రతిష్ఠించుకొని కావ్యకథానాయక ప్రాధాన్యం ఇస్తూ వచ్చిన కవితా సంపుటాలను, ఆయా రచయితల వివరాలను ఇందులో చక్కగా చర్చించినారు. ఆయన ప్రభావం ఆ తర్వాత వచ్చిన రచయితల్లో కూడా ఉందని చక్కగా ఉదాహరించినారు. ఈ విషయంలో పరిశీలించే భావి పరిశోధకులకు ఇది ఉపయుక్తకరంగా ఉంటుందని అనడంలో అతిశయోక్తి లేదు.

శ్రీ ముదిగొండ ఈశ్వర చరణ్ గారి ప్రతిభను వన్నె తెచ్చే వ్యాసం ఇంకొకటి ఉన్నది. అది 'ఉదంకుని కథ', నన్నయ గారు ఉదంకుని పాత్రను పరిచయం చేయడం ఎలా ప్రారంభించారో చెప్పుతూ దానిని ఎలా మనం సమన్వయించుకోవాలో ఆయన మాటల్లోనే మనం చూద్దాం 'గురుదయనవిమారిశాస్త్ర గుణములోదక్' విద్యాభ్యసించాడు కాబట్టి. తక్షకుని 'తోడనతగలి' నాగ లోకం వెళ్ళగలిగాడు. మొదటి గుణము లోదక్ తక్షకుని "తోదక్ తగిలి"తో సమన్వయించుకొని చదివి అర్థంచేసుకో గలవానికి కలిగే అర్థస్ఫూర్తి నన్నయ గారి దూరదృష్టి ఎంతో ఆనందం కలిగి స్తుంది. లేనివానికి ఇది పాద పూరణం మాత్రమే కాదు. వట్టి సారపురాణం' అని అంటారు. ఈశ్వర చరణ్ గారి ప్రాచీన సాహిత్యంలో ఎంత గాఢమైన అభినివేశముందో ఈ వ్యాసాల్లో మనకు ద్యోతకము అవుతుంది. అందుకే విమర్శ కుడుగా చెప్పుకునేవాడు ఏయే గుణాలు ఉండాలో, ఆయన ఈ వ్యాసంలోనే ఒక చోట ఇలా చెప్పారు. 'సాహిత్య ప్రపం చంలో విమర్శకుడు చాలా ముఖ్యమైన వాడు. కవి-పాఠకుల మధ్య వారధి విమ ర్శకుడు. అతడుచేసే పొరపాట్లు, ప్రశ ంసించే తప్పుడు ఆలోచనలు కవికీ, పాఠ కునికీ మధ్య పూడ్చలేని అగాధాన్ని సృష్టించి సాహిత్య ప్రయోజనాన్ని దెబ్బతీస్తాయి. అందువల్లే విమర్శకునికి సహృదయం - లోకజ్ఞత - నిరంతర గ్రంథపరిశీలనాశక్తి ఉండాలంటారు. విమర్శకుడు ఏ గ్రంథాన్నైతే విమర్శ చేయ దలచుకుంటాడో అప్రక్రియపైనా, ఆయా విషయంపై అవగాహన, సాధనలతో పాటు అభివ్యక్తి కూడా ఉండాలని నే నంటాను. లేని పక్షంలో విమర్శించే విమ ర్శకుడియొక్క పని పనిలేని దవుతుంది. కుడితిలోట్టిలో పడ్డ ఎలుక చందము అవుతుంది.

శ్రీ ఈశ్వర చరణ్ గారు చక్కటి అభి జ్ఞతతో అందించిన ఈ వ్యాసపీఠమును సాహితీ రసజ్ఞులెల్లరు పఠించగా భద్ర పరచుకోదగిలా ఉంది. శ్రీ ఈశ్వరచరణ్ గారి ఇతర పుస్తకాలు 'నవమి' వ్యాస సంకలనం; 'వెలుతురు' వచన కవితలు; 'స్పందన' వచనకవితలు (శ్రీయుతులు నారాయణరెడ్డి, ముదిగొండ వీరేశలింగం గార్లతో కలసి) వెలువరించారు. వీరు అనుసరించిన విమర్శ సాంప్రదాయం ఇత రులు అనుసరించేదిగా ఉంటుందని చెప్ప వచ్చును.

'జయంతి తే సుకృతి రససిద్ధాః కవీశ్వరాః'

...—...

ఉత్తమ సాహిత్యంకోసం
సమాలోచన
చదవండి!
చదివించండి!!

## కాశ్మీర్‌ను కాపాడుకుందాం!
### (బహిరంగ సభ)

జమ్మూ కాశ్మీర్ సంరక్షణ సమితి రాజమండ్రి శాఖ ఆధ్వర్యంలో ది 18-5-90 న సుబ్రహ్మణ్యం మైదానంలో జరిగిన బహిరంగసభలో ప్రధానవక్తగా రాష్ట్రీయ స్వయంసేవకసంఘ ప్రాంత సహప్రచారక్ శ్రీ వి. భాగయ్య 'ప్రజలంతా మేల్కొవాలి' రాజకీయాలకతీతంగా దేశాన్ని రక్షించుకోవలసిన బాధ్యత వహించాలని పిలుపునిచ్చారు. వర్తమానంలో జమ్మూకాశ్మీరులో జరుగుచున్న హింసాకాండ అంతరంగిక పోరాటం కాదని, మతోన్మాదుల సామ్రాజ్యకాంక్ష అని అన్నారు.

ప్రస్తుత కాశ్మీర్ సమస్యకు ఆనాటి రాజకీయ నాయకులే కారణమని గృహమంత్రిగా వున్న నాటి సర్దార్ వల్లభాయిపటేల్ దేశంలో ఉన్న సంస్థానాలన్నింటిని ఏకం చేయగలిగారని, నేటికిన్నీ వాటి విషయంలో ఎటువంటి సమస్యలేకుండా భారతదేశంలో అంతర్భాగంగా ప్రశాంతంగా మనుగడ సాగిస్తున్నాయని అన్నారు. కాశ్మీరు విషయం వారికి వదలక నాటి ప్రధానమంత్రి పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ జోక్యం జేసుకొని దానికి ప్రత్యేక ప్రతిపత్తిని సమకూర్చటం చేత మన విదేశీ ఆక్రమణదారులు కాశ్మీరును ఆక్రమించుకోవటానికి అవకాశం ఏర్పడిందని అన్నారు. ఆనాడు మన శాంతిదూతలుగా పేరొందిన దేశనాయకులు ఆక్రమదారులను ప్రతిఘటించక పోవటంచేత, నేడు అది సమస్యగా మారిందని శ్రీ భాగయ్య వివరించారు.

ఈ సమస్యకు పరిష్కారం ప్రజలందరూ ఏకమవ్వాలని, జాతీయతకు విలువనిచ్చి, నాయకుల స్వార్థాలను సమ్మకచేయాలని, జాతీయ స్రవంతితో వారినిగూడ భాగస్వాములుగాచేసి దేశాన్ని కాపాడుకోవలసిన బాధ్యత ప్రతి ఒక్కరిపైన వుందని అన్నారు. రాజ్యాంగంలోని 370 అధికరణ రద్దుచేసి, కేంద్ర ప్రభుత్వం పురుషార్థంతో కూడుకొని పాకిస్థాన్ ఎత్తుగడ విరోధించాలని కోరారు.

సభకు అధ్యక్షత వహించిన న్యాయవాది శ్రీ ద్వారా వీర్రాజు మాట్లాడుతూ ప్రజాప్రతినిధులు ఓటు కోసం ప్రాకులాడటం తప్ప వేర్పాటు దారులనుండి దేశాన్ని కాపాడుకోవాలనే భావన లేకపోవటం దురదృష్టకరమని అన్నారు. ప్రతిభారతీయ పౌరుడు కుల, మత, రాజకీయ విభేదాలను విస్మరించి, దేశం కోసం ఎంతటి త్యాగమైనా చేయుటకు సిద్ధంగా వుండాలని ఉద్బోధించారు.

న్యాయవాది శ్రీ పోతుకూచి సూర్యనారాయణమూర్తి ప్రసంగిస్తూ సాహిత్యపుటలలో సుందర నగరంగా నిలచిన కాశ్మీరం. యిప్పుడు రాజకీయ దుష్ప్రచారకుల స్వార్థం వలన పాకిస్థాన్ కాశ్మీరును కబళించాలని చూస్తోందని, కాశ్మీరు భారతదేశంలో అంతర్భాగంగా సంరక్షించుకోవలసిన అవసరం ఎంతైనా వుందని 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి' అన్న శ్రీరామవాణిని గుర్తుచేశారు.

భారతీయ జనతాపార్టీ జిల్లా ప్రధానకార్యదర్శి శ్రీ ఎస్. కె. హరనాధ్, శ్రీ ఆర్. వి. స్వామి సమస్య పరిష్కారానికి 370 అర్టికలు రద్దు, సరిహద్దు సైన్యాలకు దేశరక్షణ విషయంలో పూర్తి అధికారాలు యివ్వాలని ప్రవేశపెట్టిన తీర్మానాన్ని సభ ఏకగ్రీవంగా ఆమోదించింది.

తొలుత శ్రీ ఓలేటి సత్యనారాయణ స్వాగతం పలికారు.

పాకిస్తాన్ చేస్తున్న దురాగతాలకు వ్యతిరేకంగా భారతీయ విద్యార్థి పరిషత్ సభ్యులు నినాదాలు చేశారు.

....శ్రీ సత్యసోదు

(0)

సమాలోచన 4,5,6,7,8,9,10,11,12 వార్షిక సంపుటముల వెల వరుసగా 20, 20,12,15,15,15,15, 20 20 రు. లు ఎం. ఓ. చేసినవారికి ఖర్చులు మేమే భరించి రిజిష్టర్డు పోస్టులో పంపగలము. వి. పి. పద్ధతి లేదు.

- సంపాదకుడు.

Editor, Printer and Publisher B. Ravikanth, Printed at B. V. & Co., Press, TyagarajaNagar, Rajahmundry - 1.